...కరస్తు.

...పరబ్రహ్మణేనమః.

# చిన్న కామమ్మ కథ.



ఈగ్రంథము.

పండితులచే బరిష్కరింపఁబడి

యన్. వేణుగోపాలు మొదలియార్ గారిచే



శ్రీ రస్తు.

శ్రీ గురుభ్యోనమః

# చిన్న కామమ్మ కథ.



శుభముకామమ్మా శుభముకామమ్మా కామమ్మ
శుభ మొందసామర్లకోటలోనమ్మా కామమ్మ
సుకపట్లలక్ష్మయ్య ముద్దుకూతురుగా కామమ్మ
వెంకమ్మగర్భాన జననమైనాదీ కామమ్మ
మాయదారికరువు నాడొచ్చెనమ్మ కామమ్మ
కరువులో తలిదండ్రి లైబోయినారు కామమ్మకు
పెత్తండ్రిరామన్న ప్రేమతో పెంచే రామన్న
పెత్తల్లివెంకమ్మ ప్రేమతో పెంచే కామమ్మ
పెంచిమేనల్లునికి పెండ్లిచేసెనుగా కామమ్మను
తిరుపాతిమారయ్య పెండ్లాడినాడు కామమ్మను
పెండ్లాడినా అయిదునెలలనాడైన మారయ్య
కాకినాడాలోను కలకటేరొద్దా మారయ్య
పెద్దబోయికొలువు తాకుదిరినాడు మారయ్య
నెలమూడువరహాలు తాజీతగాడూ మారయ్య
ఆరునెలలాకొలువు తానొల్చినాడు అక్కడను
దొరకు మారయ్యకు నొకమాటవచ్చె వకరోజు
చాలునుదొరగారు చాలుసీకొలువు దొరగారు
నాజీతమైనా నాకుయిప్పిస్తె దొరగారు
తిరిగి శామర్లకోట యింటికెళ్లుతాను దొరగారు
మారయ్యజీతాలు లెక్కజూచిరిగా ఆరోజు
ఆరునెలలా జీతమడిగిపుచ్చుకొని మారయ్య

కకోట యింటికొచ్చెనుగా మారయ్య

చిన్న కామమ్మ కథ.

వాకిటికి ఆతల్లి యెదురుగుండొచ్చె చల్లమ్మ
ఏమొస్తివో కొడక యేలొచ్చినావూ మారయ్య
కాకినాడాకొలువు చాలిపోయిందే చల్లమ్మ
చెన్నపట్నపుకొలువు నేవెళ్లుతానూ చల్లమ్మ
మాయదారి చెన్నపట్నమేగదరా మారయ్య
చెన్నపట్నపుకొలువు మనకచ్చిరాదూ మారయ్య
కిందటామీతండ్రి కొలువెళ్లినాడు పట్నమూ
ఆ చెన్నపట్నములోను చనిపోయినాడు మీతండ్రి
యంతలేదుతల్లి కొలువెళ్లుతానూ చల్లమ్మ
కాదనవద్దనగ సైనమైనాడు మారయ్య
నిన్నుచూడగలేను క్షణముండలేనూ పోకొడుకా
నా పేరుచెప్పి తులసిమొక్కయ్యే చల్లమ్మ
నిత్యాము ముమ్మాటు నీళ్లుపొయ్యావే చల్లమ్మ
ఆతులసిమొక్కయిన బాగవుంటేను చల్లమ్మ
యిలలోన మారయ్య వున్నడనుకోవే చల్లమ్మ
ఆతులసి మొక్కయిన యెండిపోతేనూ చల్లమ్మ
యిలలోనమారయ్య లేదానుకోవే చల్లమ్మ
శనివారపురోజు వక్కప్రొద్దుంటె మారయ్య
తలయంటితెలహార స్నానంబుచేసి మారయ్య
మూడుసేర్లసముగ తిర్లక్కై తేనుగా దేవుడికి
కొత్తతోవతులైన కట్టుకున్నాడుగా మారయ్య
వంటిపూటేతాను భోంచేసినాడు మారయ్య
ఆదివారమునాడు ఇంటొద్దవుండే మారయ్య
సోమవారమునాడు తెల్లారినట్లా మారయ్య
తల్లిచల్లమ్మకు దండముపెట్టె మారయ్య
క్షేమానని వెళ్లి లాభానరమ్మా మారయ్య
తమ్ముడు రెడ్డికి తాసెప్పేనేమీ మారయ్య
కాకినాడాగనుక సాగనంపెనుగా తమ్ముడు
కాకినాడారేవు వాడెక్కినాడూ మారయ్య
నదిమీద ఆవాడ మూడురోజులునడిచే ఆవాడ
... మారయ్య

తమ్ముడు రెడ్డిని తాచేరపిలిచి మారయ్యా
పరిగెపితాపురము నీవెళ్ళగలవా రెడ్డన్న
మీవదినెగారిని నీవు పిల్చుకొస్తావా రెడ్డన్న
కండ్లచూడవలెను తీసుకొనిరమ్మా రెడ్డన్న
అన్నమాటింటానే తాపైనమాయా రెడ్డన్న
పరిగెపితాపురము పరుగువెళ్లెనుగా రెడ్డన్న
అప్పుడు కామమ్మ కలగన్నదేమీ ఆవేళ
శుక్రవారమునాడు తలనిండసమురే కామమ్మకు
జాలారుబండకు జలకమాడిందో కామమ్మ
తూగుటుయ్యాలలో పవళించెనమ్మా కామమ్మ
ముగ్గురు దేవతలు వనగూడినారు ఆవేళ
కొంచెములో బత్యాలు కొని తెచ్చినారూ ఆవేళ
మాట్లాడి దేవతలు మాయమైనారూ ఆవేళ
తనపెనిమిటి మారయ్య కొలువెళ్ళినట్లా అక్కడను
ఆరునెల్లాకొలువు తాకుదిరినట్లా అక్కడనూ
అక్కడకొలువులే చాలించుకొని మారయ్య
ఆరునెల్లాజీతం అడిగిపుచ్చుకొని మారయ్య
సామర్లకోటకు తావచ్చినట్టూ మారయ్యా
తల్లిచల్లమ్మ తాయెదురుగొచ్చినట్లు చల్లమ్మ
యేమిరానాకొడుకా యేలొచ్చినావు మారయ్య
అమ్మరో చల్లమ్మ అమ్మ చల్లమ్మ చల్లమ్మ
కాకినాడాకొలువు చాలించుకొంటి చల్లమ్మ
చెన్నపట్ణపుకొలువు నేవెళ్లుతానే చల్లమ్మ
అప్పుడు చల్లమ్మ తాఅడలకుండా చల్లమ్మ
కిందటా మీతండ్రి కొలువెళ్ళినాడూ పట్ణాము
ఆచెన్నపట్ణములోనె చనిపోయినాడు మీతండ్రి
మాయదారి చెన్నపట్ణమేగదరా నాతండ్రి
చెన్నపట్ణపుకొలువు నీవెళ్ళవద్దు నాకొడుకా
కన్నతల్లిచల్లమ్మ యిట్లానిచెప్పె ఆవేళా
తల్లిమాటినకానె తాపైనమాయె మారయ్య
చెన్నపట్ణపుకేవు తాను దిగినట్లూ మారయ్య

## చిన్న కామమ్మ కథ.

చెన్నపట్నపుకొలువు లోకుదిరినట్లు మారయ్యా
నెలకై దువరహాలు తాజీతగాడూ మారయ్యా
చెన్నపట్నపుకొలువే కొన్నాళ్లుకొలిచి మారయ్యా
పూరిమీదతనకు భ్రమపారినట్లూ మారయ్యా
దొరవద్ద సెలవడిగి తాపైనమాయె మారయ్యా
కాకినాడరేవు తానుదిగినట్లూ మారయ్యా
మాయకడుపునొప్పి తాబుట్టినట్లు మారయ్యాకూ
దారిలో మూడు లంకనాలుగా మారయ్యా
లంకనాలతోటి యింటికొచ్చెనుగా మారయ్యా
దారిలో అవశకునమంతా నాయెనేమీ మారయ్యా
వంటిమూలవాడు యెదురాయెనేమీ ఆవేళ
నాగుపామువకటి అడ్డముపడ్డదిగా మారయ్యాకు
కొత్తకుండ అప్పుడు యెదురువడిందిగా మారయ్యాకు
ఆ అడవినంతనె తావదుగు పాయ అవేళా
వేపచెట్టునబల్లి తాబల్కినాదీ అవేళా
అయ్యాయొయ్యఅంటను అశరీరిబల్కె అక్కడనూ
ఇన్ని శకునములుచాటి యింటికొచ్చెనుగా మారయ్యా
యింటికిరాగానె తల్లిచల్లమ్మ చల్లమ్మ
యేమిరాకొడుక యేమొచ్చినావు మారయ్యా
చెన్నపట్నపుకొలువు పయిచచ్చినాదీ చల్లమ్మ
మిముకన్నులచూడ నేవచ్చినానే చల్లమ్మ
పడమటింట్లో నాకు పడక వెయ్యావే చల్లమ్మ
నీముద్దు కోడలిని పిలువనంపావే చల్లమ్మ
తమ్ముడు రెడ్డిని తాపిలిచినట్లా మారయ్యా
మీవదినెగారిని పిలుచుకోనిరమ్మ రెడ్డన్న
అన్నమాటింటూనె తాపైనమాయా రెడ్డన్న
చెన్నపట్నపు యేమయ్యానేమీ మారయ్యా
ఇటువంటికలలు నేగన్నసమ్మ అమ్మయ్యా
ఇదియేమికారణమొ నేనెరుగనమ్మ అమ్మయ్యా
నాపెనిమిటి మారయ్యాకు యేమివచ్చెనో అమ్మయ్యా
ఇదియేమిచోద్యము నేనెఱుగనమ్మా అమ్మయ్యా

నాకల తప్పుదు నేనేమి సేతు అమ్మయ్యా
నాకు అయిదుపంఢ్లుఆయెను పెండ్లియూడి మారయ్యా
ఈవరకునాపెనిమిటిని నేనెరుగనమ్మ అమ్మయ్యా
నాపెత్తంఢ్రిరామన్న యేడ్లెనాడూ అమ్మయ్యా
నామరిది రెడ్డన్న వచ్చెనో యేమో అమ్మయ్యా
వెఱ్ఱివెఱ్ఱికలలు నేగంటినమ్మ యీవేళ
ఇట్లు తనలోనె కలగని తల్లడిల్లుచును కామమ్మ
పెదతంఢ్రి రామయ్య కొలువుకొచ్చింది కామమ్మ
కలగంటిరామయ్య కలగంటినయ్యా రామయ్య
ఏమికలగిన్నావు చెప్పవే నీవు కామమ్మ
బ్రహ్మలోకానికు మనుష్యమైనట్లు మారయ్యా
జూడరానిభూమి జూడకలగంటి రామయ్యా
అగ్నికుండములోనె దూకకలగంటి రామయ్యా
కుడిచేతిసిలాలు నీళ్లకలగంటి రామయ్యా
కుడికాళ్ళమెట్టలె ధరణిపైబడెనూ రామయ్యా
అత్తివ్రాసలదండ తెగినేలబడెనూ రామయ్యా
నొష్టకుంకుమ నేలబడినట్లు రామయ్యా
తోలసమ్మదగ్గర నోమునోచినట్లా రామయ్యా
నాయొక్క పెనిమిటి మారయ్యగనుక రామయ్యా
చచ్చినట్లు కలగంటినేనూ రామయ్యా
ఆయొక్క కలలన్ని అబద్ధమనెను రామయ్యా
రాత్రికాలముకలలు మతినుంచరాదూ కామమ్మ
ఆకురాలేకలలు పాటింపులేదూ కామమ్మ
నీయొక్క కన్యలు కలగంటెనమ్మ తగులమ్మ
సతివారికలలు తప్పేదిలేదూ రామయ్యా
రేపుమధ్యాహ్నవేళకు నామరిది రెడ్డి రెడ్డన్న
కబురువచ్చేవేళకు కదలిపోతాను రామయ్యా
నాకలదప్పుదు న్యాయమువినుము రామయ్యా
ఇట్లు తాగన్నకలలన్ని చెప్పుచుండెనుగా కామమ్మ
రామయ్యనమ్మక తలయూచినాడు రామయ్యా
యింతలో రెడ్డన్న యెదురాయెనేమో ఆవేళ

## చిన్న కామమ్మ కథ

ఇట్టినోము మనకచ్చిరాదె కామమ్మ
ఇట్టినోము నేనోచినానూ కామమ్మ
భూమిలోపలసిమాామ అయిపోయినాడు కామమ్మ
మారయ్యవొల్లుతా బాగుగానుంతెను కామమ్మ
వారాక్షియీనోము నోచవచ్చునుగదా
కమలాక్షి యీనోము నోచవచ్చునే
కార్తీకపౌర్ణాలు నీవువుందువుతల్లి
వెధవముండల నోమునోచినానే అత్తమ్మ
ఇంతనోముఫలము యధికమానె అత్తమ్మ
వద్దనగ చెప్పగా నోముపట్టింది కామమ్మ
తనయీాడుబాలులకు తలయంటబోయి కామమ్మ
బాలులతోటి బోంచేసినాది కామమ్మ
ఉదయప్రొద్దున బోజనముబెట్టి బాలులకు
మర్రిచెట్టుకు వుయ్యాలవేసె రెడ్డన్న
తూగుటుయ్యాలపై జాముతూగుంది
అస్తమానవుప్రొద్దు అవుడుచూచింది
వుప్పోలపత్తర కోసుకొచ్చింది కామమ్మ
నేరెడుమారేడు మంచిపుష్పములు కామమ్మ
యెఱ్ఱగన్నేరు పూవులుకోసుకొచ్చించి కామమ్మ
అస్తమానవువేళలో యింటికొచ్చింది కామమ్మ
ఆడబిడ్డసీతమ్మ స్నానముచేసి యింట్లోను
ఇల్లలికిముగ్గులు ఋంపుతోబెట్టె సీతమ్మ
అట్లతద్దెనోముకు యేకువడిగినాది కామమ్మ
తల్లయంటిస్నానము సొంపుతోచేసె కామమ్మ
పచ్చనిపసుపుదా బూచిచీరగట్టె కామమ్మ
గౌరిదేవిని గొబ్బుతోనిలిపె కామమ్మ
ప్రీతితోఅప్పుడు పూజించినాది కామమ్మ
బ్రాహ్మణునియొక్కని బిలిపించినాది కామమ్మ
నోముకథలన్ని చెప్పమన్నాది బ్రాహ్మణుని
అక్షింతలిచ్చిదా వింటుయున్నాది కామమ్మ
వడమటింటిలో కల్లం తెలాయె అప్పుడు కామమ్మ

అయ్యయ్యోమారయ్య యనిఏడ్చినాడు రెడ్డన్న
ఘోరమఘోరమున తాదుఃఖించినాడు రెడ్డన్న
అట్లతద్దినోము కురుచాయనమ్మ కామమ్మ
మీయన్నదేహము యెట్లుయున్నాది ఓమరిది
మాయన్నచోటున మాటఅణిగెను కామమ్మ
వచ్చెప్రాణముగాదు పొయ్యెప్రాణమే కామమ్మ
పూర్వపుణ్యఫలము యిదియున్నది కామమ్మ
చాలించుబ్రాహ్మణ చాలించుమయ్యా నీకథలు
పప్పుబియ్యమిచ్చి బ్రాహ్మణునిబంపె కామమ్మ
గౌరిదేవుని బట్టనంగ నగవిప్పె కామమ్మ
నోమునోచిననూలు మెడవేసినాది కామమ్మ
మారయ్యయుండేటి యింటికొచ్చె కామమ్మ
ముత్యాలనోటితో ముచ్చటలాడు నాసామి
పగడాలకంటితో పాతిమాడయ్యా నాసామి
వొంటరిగానీకు నిద్రపట్టిందా నాసామి
ఈడుజోడుగానే యుంటువనుకొంటి నాసామి
ఈడీడిచిజోడిడిచి నీవువెళ్లుతావా నాసామి
ననువిడిచిపొయ్యేది న్యాయమా నాసామి
విష్ణుమాయలచేత వింతకటాయె నాసామి
బ్రహ్మమాయచేత బలాయెనే నాబ్రతుకు
అన్యాయబ్రహ్మతా ఆకుచించెనే యిప్పుడు
పాపిష్టియాబ్రహ్మ బడగొట్టెనిపుడు నాసామి
నీపుణ్యభాగ్యాలు నేనెరుగనయ్యో నాసామి
చిన్ననాడునన్ను బెండ్లాడినావె నాసామి
కంకణముగట్టిన ఘనుడెరుగనేమి నాసామి
బ్రహ్మముళ్లువేసిన సామినెరగలేనె నాసామి
పెండ్లయినమైదేండ్ల కొలువెళ్లినావె నాసామి
ఏడేండ్లకైనాను యిచటికిరాలేదు నాసామి
వచ్చినగానిమంచమెక్కలేదె నాసామి
యీడెరిగిమైదేండ్లు యింటనున్నావే నాసామి
అయ్యయ్యోనాసామి అన్యాయమాయనె నాసామి

chinna kāmamma katha heading:



అప్పుడుకులవారి నందరినిబిలచింది కామమ్మ
దర్భవేసిదా నట్టింటపరచెను కామమ్మ
నారాయణయనుచు కిందదింపింది మారయ్యను
పెనిమిటికియప్పుడు పారిపోయి కామమ్మ
రామతొలసినైన కోసుకొచ్చింది కామమ్మ
తులసితీర్థము యప్పుడిచ్చింది కామమ్మ
తెల్లవారిజూచి మరిగిపోయెనె మారయ్య
నారాయణయని నప్పుకొన్నాది కామమ్మ
హరినామకీర్తనలు పాడుచున్నాది కామమ్మ
అత్తచల్లమ్మ అడలసాగింది చల్లమ్మ
ఎందుకేడుస్తావు యెత్రిబట్టి అత్తమ్మ
యెన్నాళ్ళుయేడ్చినా కొడుకురాడు అత్తమ్మ
చచ్చినకొడుకు మరలవస్తుడా అత్తమ్మ
ఏడువకుఏడువకు యెత్రినామరది రెడ్డన్న
యెన్నిదినములకేడ్చినా మీయన్నరాడు రెడ్డన్న
భూమిలోవీసము జాగయిప్పించు రెడ్డన్న
అగ్నిహోత్రమునకు దయసేయుమయ్యా రెడ్డన్న
ఇట్టిబుద్ధినీకు యేలగలిగింది కామమ్మ
వెఱ్ఱిబుద్ధియేల నీకుతోచనే కామమ్మ
చచ్చినవారితో చచ్చేవారెవరే కామమ్మ
బ్రతికినవారితో బ్రతికేవారెవరే కామమ్మ
మాయన్నభాగ్యము మేమితిన్నావు కామమ్మ
మాయన్నవస్త్రము ఏమిగట్టితివి కామమ్మ
మాయన్నలాగున నిన్నుజూచెదము కామమ్మ
అన్నవస్త్రమున కేమికొదవ కామమ్మ
వెధవవిభవము మీరుజూడవలెనా వోమరిది
పట్టెడుబొట్టుంటె పదిలక్షలయ్యా వోమరిది
పసుపుకుంకుమలేక గడియయుండలేను వోమరిది
పోయినకుంకుములేక గడియయుండలేను వోమరిది
పదివేండ్లుండినా పడకమానెను గుణ్ణాన
కంపినికయిదా నడుస్తున్నాది రాజ్యములో.

కాకినాడాయందు కలెక్టరుంటె కామమ్మా
కలకటరుదొరగారు మహాచెడ్డవాడు కామమ్మా
అగ్నిగుండమునకు సెలవివ్వడమ్మా కామమ్మా
బ్రతికేవారికిమీకు బయాలుగనుక పోదురిది
చచ్చేదానికినాకు భయములేదు పోమరిది
మనకోటకస్తాను శెలవుగావలెను కామమ్మా
కోటలోకియప్పుడు బయలుదేరెను కామమ్మా
కస్తానుదొరసాని నాగమ్మగనుక యప్పుడు
బండెక్కిదొరసాని ఎదురుగవచ్చెను యప్పుడు
ఏవూరువపల్లె ఎవరికోడలు చిన్నదాన
యెవరింటపడుచుదా యెవరికోడలు చిన్నదాన
సుకపల్లవారాడ పడుచునన్నాది కామమ్మా
స్థిరముగతిరపతోరి కోడలనునేను దొరసాని
నాయొక్కపెనిమిటి చనిపోయినాడు దొరసాని
అగ్నిగుండముల త్రొక్కించవమ్మా దొరసాని
ఇట్టిబుద్ధికు ఏలకలిగెను కామమ్మా
రెండుకత్తులభూమి మాన్యమిస్తానె కామమ్మా
నీవుకోరినచీరలు కొనిపెట్టుతానె కామమ్మా
అన్నవస్త్రానికి ఆసించలేదూ దొరసాని
మళ్ళుమాన్యాలయిన మాకేమిసేయా దొరసాని
మాకుపన్నెండు బొట్టుంటె పదిలక్షలమ్మా దొరసాని
పసుపుకుంకుమలేక ఘడియయేగలేను దొరసాని
నీకుపసుపుకుంకుమమీద ప్రేమలుంటె కామమ్మా
నీమరిదిరెడ్డికి నీవుంచుకోవే కామమ్మా
రెడ్డినినిచ్చి పెండ్లిచేసెను కామమ్మా
మారయ్యకిచ్చేది మూడువరహాలు జీతాము
మారయ్యజీతాము రెడ్డికిప్పించెద కామమ్మా
నారాయణంటను చెవులుమూసుకొనె కామమ్మా
నీతికారణమా జాతికారణమా దొరసాని
కులముకారణమా గుణముకాలణమా దొరసాని
మారుమనుమూపెండ్లి మాయింటలేదే దొరసాని

(3) చిన్న కామమ్మ కథ.

యేడుమనుములదాక నీయింటకద్దు దొరసాని
నీకూతురురుక్మిణిని గట్టమన్నాది కామమ్మా
మనివుండెసత్యాలు చూపుతున్నాను దొరసాని
యిలమీదనాసత్య మికజూడవమ్మ దొరసాని
యింతలోమాయకడుపునొప్పి కనిపించినాది దొరసానికి
జగిజావకజాము కష్టపడ్డానీ దొరసాని
నిలువునప్రాణాలు పోగొట్టినాది దొరసానికి
కోటలోకొస్తాను దొరగారువినెను యీమాట
చెల్లుచెల్లునే కామమ్మా నీకుచెల్లునమ్మా కామమ్మా
జగతిలోనవింతపతివ్రతరాకాట మెరుగము కామమ్మా
పోయినప్రాణాలు బొందికొనెదు కామమ్మా
మాకోటలోవున్నావి చావతాళమ్మా కామమ్మా
చావతాళ్లుగట్టి గళ్లుగట్టింతూ కామమ్మా
వకయేడుతిరుణాల నీకుచేయిస్తా కామమ్మా
కొబ్బెరబెల్లాలు కొండరటిపండ్లు కామమ్మా
ఆదివారమునాడు పలహారమిస్తు కామమ్మా
చెన్నపట్నపు హొరల శెలవుతెచ్చుకో గుణ్ణానికి
మంచిగంధపుచెక్క మణుగునిస్తాను గుణ్ణానికి
తెప్పునకేకేసి లేచికూర్చుండె దొరసా
వంగొంగిసలాము చేయసాగెను దొరసాని
మనివుండగానాకు దండంపెట్టొద్దు దొరసాని
నేనుచచ్చినతరువాత దండంపెట్టండి దొరసా
నెలనుబెత్తరేమీ గుణమెంచబోరు ప్రజలైన
రిగిసామర్లకోట యించికొచ్చింది కామమ్మా
చ్చినళపాన్ని కూర్చుండబెట్టి పెనిమిటిని
లయంటితలహార స్నానంబుచేసె పెనిమిటికి
మణితిరుచూర్ణం తీరుగానుంచి పెనిమిటికి
ంచిగంధముతీసి మారయ్యకుపూని కామమ్మా
త్తరుసంపంగి నూనెపూసింది కామమ్మా
ంచుదోవతులు మొలకుగట్టింది పెనిమిటికి
ొప్ప మొలతాడు మొలనుగట్టింది పెనిమిటికి

మారయ్యారుమాల తాదీసుకొనెను కామమ్మా
మారయ్యశిగబొందు తామెడనువేశే కామమ్మా
పట్టుమంచము వాల్చి పరపమరచి కామమ్మా
పరుపునసంపంగి పూలుపరిచింది కామమ్మా
పట్టెమంచముమీద పారుండబెట్టి పెనిమిటిని
పన్నెరుజవ్వాది పైచల్లినాది కామమ్మా
పరకాళ్ళదుప్పటి పైనిండగప్పె కామమ్మా
పగ్గ కాముగ్గకా నివుండవయ్యా మారయ్య
పాపిష్టియాధొరలు పడన్వ్వేమీ గుండాన
నేనుచెన్నపట్ణంబోయి శలవుతెస్తాను మారయ్యా
తలవుదగ్గిరతీసి తాళాలువేసే కామమ్మా
కుంపిణీసురాయి చాలపెట్టింది కామమ్మా
మంత్రిమావాటొరి ఆజ్ఞలుంచింది కామమ్మా
గురువుఆచార్యుల ఆజ్ఞలుంచింది కామమ్మా
తలుపుతాళాలైన తీస్తేనుమీదు అత్తమ్మా
మారయ్యనిక్కడ పండించితేనూ యిక్కడనూ
పిలుపనేరులేకుండ చేసెనన్నాది కామమ్మా
రావోయిరెడ్డన్న నాచిన్నమరది రెడ్డన్న
కట్టంటిపైనాలు కాకినాడకుగా రెడ్డన్న
పెత్తండ్రిరామన్న పైనమన్నాది కామమ్మా
పినతండ్రిగురువన్న పైనమన్నాది కామమ్మా
మేనమామకృష్ణమ్మ పైనమన్నాది కామమ్మా
అంతకట్టండిపైనాలు కాకినాడాకుగా మీరంత
కాకినాడాకునివు యటబోతావే కామమ్మా
అల్లతద్దెవాన మహాకురిచెనమ్మ కామమ్మా
యేరులూనుకొరులూను యేకమైనాది కామమ్మా
కొంత కాలవలన్ని తర్లివచ్చె కామమ్మా
భీమొరపుకాలవ నిండియున్నాది కామమ్మా
యీటవేసినగాని నాటకున్నది ఆకాలువ
తాళ్లువేసినగాని పాతియ్యదమ్మా కామమ్మా
వడ్డుమీదగంగ పొర్లుచున్నాది కామమ్మా

చిన్న కామమ్మ కథ.

దోనెలులేవమ్మ సంగవులేపూ కామమ్మా
బ్రతికేవాండ్లుగనుక భయాలుమీకు రెడ్డన్న
చచ్చేవాండ్లకుమాకు భయాలుయేమి రెడ్డన్న
నామాటవినవే నాసతికామమ్మా కామమ్మా
కలకటేరు మహాచెడ్డవాడె కామమ్మా
భూమిలోగుండానికి సెలవివడమ్మా దొరగారు
పెదపాటియెర్రప్ప మాలవాడుగా యెర్రప్ప
ఆపెదపాటియెర్రప్ప పెండ్లి పెండ్లాము చిన్నమ్మా
ఆరుయేండ్లపట్టి యేలకున్నాడు చిన్నమ్మను
కుంపిణీకొలువులో తానున్నాడు యెర్రప్ప
గండికోటకాడ జగడానికెళ్ళె యెర్రప్ప
రణముగడిచెడివాడు వస్తువున్నాడు యెర్రప్ప
దోవలోఅంబోతు పొడచిచంపింది యెర్రప్పను
ఆయెర్రప్పభార్య చిన్నమ్మగనుక చిన్నమ్మా
కలకటేరొద్దకి శెలవుకెళ్ళింది చిన్నమ్మా
భూమిలోవీసము జాగయిమ్మనెను దొరగారిని
మాలదానికేమి గుండాలుయేమి దుబాసి
ఆమాటచిన్నమా చెవులబడ్డదిగా చిన్నమ్మా
జాతులోరితోట పనులేమినాకు దుబాసి
మా వాటివారితో మాటలున్నవిగా నాకైన
కోపగించక తానువస్తువున్నాది చిన్నమ్మా
అంతకలకటే రామన్నడంటే అక్కడెను
యేమేమిసత్యాలు జూపుతుందేమి దుబాసి
నేనడిగినపరిక్షు యిస్తుందయేమి చిన్నమ్మా
అడిగినపరీక్షు యివ్వగలదయ్యా చిన్నమ్మా
వంద్రబొగ్గులు తెచ్చి పోగుపోయించి దొరగారు
కంమర్లపిలిపించి కొలిమిబెట్టించి దొరగారు
జోడుపిరంగిగుండ్లు కాలేసినాకె కొలుములలో
కాలేటిఆగుండ్లు చేతబట్టించి దొరగారు
ఎంటివాచిన్నమ్మా వివరంబుగాను చిన్నమ్మా
భూమిలోనిసత్య మికచూడవలె చిన్నమ్మా

వెన్నముద్దలవలె యెగరయ్యాను నేను ఈగుంళ్ళు
ఆమాటలకప్పుడు ఘల్లుననవ్వి చిన్నమ్మా
కాలేటిసూర్యుడా దండమన్నాది చిన్నమ్మా
నాపాలిటియెఱ్ఱప్ప! యెక్కడున్నావు యెఱ్ఱప్ప
వెయ్యమనిచిన్నమ్మ! దోసిలేపట్టె ఆగుండ్లు
యెంచియేడుమాట్లు యెగరేసినాది ఆగుండ్లు
సంవిస్త్రైఆగుండ్లు మింగుతానయ్యా దొరగారు
చేతిలోఆగుండ్లు పసుపుగానలిపె చిన్నమ్మా
అప్పుడుగుండానికి శెలవిచ్చినాడు దొరగారు
ఆలాగుననిన్ను కష్టపెట్టుతానే కామమ్మా
బ్రతికేవాండ్లకు బయాలుగనుక రెడ్డన్న
చచ్చేవారికిమాకు భయాలుయేమి రెడ్డన్న
పావులపెట్టయిన పసుపుగొన్నాది కామమ్మా
వాకిటవుండాది మండపరోలూ కామమ్మా
పసువుకొట్టుతాతల్లి పాటపాడింది కామమ్మా
కొట్టినపసుపంతా తోడుకొన్నాది కామమ్మా
అడ్డెడక్షింతలూ తాజేసినాది కామమ్మా
కోటబొమ్మంచుల చీరగట్టింది కామమ్మా
అందానికద్దాల రవికెదొడగింది కామమ్మా
నిమ్మకాయలుభరిణ చేతబట్టింది కామమ్మా
అడ్డెడక్షింతలు వడగట్టినాది కామమ్మా
సురకత్తిరుమాల చాతబట్టింది కామమ్మా
ముందరకామమ్మ విడిబడ్డదేమీ కామమ్మా
భీమొరపుకాలువ వొడ్డుకొచ్చింది కామమ్మా
వడ్డుమీదనెగంగ పొర్లుచున్నదిగా కాలువ
పొంగేటిగంగను కండ్లచూచింది కాలువ
పాదియ్యోగంగప్ప పాదియ్యోనమ్మ గంగప్ప
చెలిమితోనీకు చెల్లనుగాదా గంగప్ప
మలవారింటను నీవుపుట్టినావే గంగప్ప
బెస్తవారింటను నేపుట్టినానే గంగప్ప
బెస్తకులమాయబెరునికు చూడకె గంగప్ప

# చిన్న కామమ్మ కథ.

తోలాక టన్మానతితో డబుట్టితి గంగప్ప
నీమరిదిమారయ్య చనిపోయినాడె గంగప్ప
నేనుకలకటేరొద్దికి శలవుకెళ్లుతానూ గంగప్ప
అడ్డదక్షింతలు కాలువలోవేసె కామమ్మా
నిమ్మకాయలభరిణ కాలవలోవేసె కామమ్మా
పట్టెంచుపోగునూళ్లు కాలవలోవేసె కామమ్మా
అప్పుడుకరకంచు చీరైనకాసెబోసింది కామమ్మా
పెదతండ్రిపినతండ్రి చేరవచ్చ్యారూ ఆవెనుక
మేనమామతనమరిది చేరవచ్చిరిగా అక్కడి?
కాలేటిసూర్యుడా దండమన్నాది సూర్యునికి.
మేముతొక్కినభూదేవికి తోడుగావమ్మా భూదేని
వేడుకతో వెంకటేశ్వరునిదలచింది కామమ్మా
ప్రేమతో భీమలింగానికిమ్రొక్కి కామమ్మా
కరకంచుచీరైన కాసెబోసింది కామమ్మా
హరినారాయణన్నది అడ్డపడ్డాడే కాలువలో
నీలమండలోతుదాటిపోయింది కాలువ
వెనకాన పెదతండ్రి కందాకపోయె ఆకాలువా
మరిదిరెడ్డన్నకూ మరిఅందమూయె ఆకాలువ
అవతలొడ్డుకుపోయి ఘల్లునానవ్వే కామమ్మా
రావోయిరెడ్డన్న నాచిన్నమరిది రెడ్డన్న
నీసత్యముండంగ నీవెల్లినావే కామమ్మా
పడవలులేవమ్మ నంగడులులేవూ కామమ్మా
మేమెట్లువత్తుము నాతికామమ్మా కామమ్మా
మీరునీళ్ళలోనానేటి నీరుకోతులుగా వోమరిదీ
బెస్తబిడ్డలైతే యీదుకొనిరండి మీరైన
యీతగొట్టామాకు చేతగాదమ్మ కామమ్మా
ఇంయతెప్పలు రెండు కనిపించినాది కామమ్మా
మరిదిరెడ్డన్న తెప్పగట్టెగా రెడ్డన్న
పెదతండ్రిపినతండ్రి మేనమామలుగా ఆవేళ
యేడుగడియలకు కాకినాడావెళ్లిందీ కామమ్మా
మెల్లానేకలకటేరు మేడకెళ్లిందీ కామాంమ్మ

కొత్తాలుసోమన్న యెదురుగుండొచ్చె సోమన్న
చెలిమితోనుకు నేచెల్లలనుగా నాసోమన్న
దొరతోనవొకమాట చెప్పంగగలవా సోమన్న
మాభాగున్నాడు మంచిదన్నాడు సోమన్న
మేడమీదనుంచి దొరగారుజూచె కామమ్మా
ఆడకూతురుగా యేడకొచ్చింది దుబాసి
యేమివరవాన మడుగుమన్నాడు దొరగారు
చెంగయ్యదుబాసి పరుగునొచ్చెనుగా దుబాసి
యేమెచిన్నదాన యేమెుచ్చినావు చిన్నదాన
యేవూరుయేపల్లె యెవరుపేరు చిన్నదాన
కాపురం సామర్లకోటయన్నదిగా కామమ్మా
సుకపట్ల వారాడపడుచునన్నాది కామమ్మా
స్థిరమైన తిరుపతొరికోడలను నేను చెంగయ్యా
నాకుభూమిలోపెనిమిటి చనిపోయినాడు చెంగయ్యా
నేనుభూమిలో వీసముజాగడగవస్తి చెంగయ్యా
ఆమాటదొరతొటి తాచెప్పినాడు చెంగయ్యా
కామమ్మనెదటికి పిలిపించినాడే దొరగారు
యేమెచిన్నదాన యేమెుచ్చినావూ చిన్నదాన
నాపెద్దబోయిడు ఘనుడుమారయ్యా మారయ్యా
మూడునెల్లారజ తీసుకొన్నాడూ పట్ణములో
మాదేశమునకువస్తానే చనిపోయినాడు మారయ్యా
ఆమారయ్యభార్య కామమ్మనేను దొరగారు
భూమిలోవీసము జాగయిప్పించు గుండానికి
రెండుయిల్లుజాగ యిప్పించుమనెను దొరగారు
ఇంట్లోనుగావయ్యా వాకిళ్లగావు దొరగారు
మీజాతిన్యాయాన గుండాలులేవుదొరగారు
తెల్లగన్యాయములోను గుండాలుగలవ, దొరగారు
తూర్పురాజ్యాన గుండాలుతరుచు దొరగారు
రెండునిలువులపొడుగు త్రవ్వుతారయ్యా దొరగారు
త్రవ్వేటిగుండములో కలపతిట్టేరూ దొరగారు
అగ్నిహోత్రముతైన అంటించుతారు గుండములో

# చిన్న కామమ్మ కథ.

నూనెసిద్దలువారు పగులపోసేరు గుండాన
భగాభగామంటలు మండుతున్నావి గుండామూ
మండేటిమంటలో మరిదూకుతారూ దొరగారు
అగ్నిలోపడితేనూ అవస్తగాదా దుబాసి
నీకుఅగ్నిలోబడియేటి అన్యాయమేమిరా కాకామ్మా
నిప్పులోబడియేటి అన్యాయమేమికామమ్మా
మంటలోబడియేటి మర్యాదలేమిరా కామమ్మా
నాకుపట్టెడెబొట్టుంటె పదిలక్షలయ్యా దొరగారు
పసుపుకుంకుమలేక ఘడియయేగలేనూ దొరగారు
నీకుపసుపుకుంకముమీద ప్రేమలుంటెనే కామమ్మా
మీబెస్తవర్ణాన మారుమనుముంది కామమ్మా
మారుమనుములపెండ్లి చేయించుతాను కామమ్మా
మారయ్యకన్నాను మంచివాన్నిగా కామమ్మ
మంచివాన్నిగాను మరిచూచుకోవె కామమ్మ
పట్టినాఖర్చిచ్చి పెండ్లిచేయిస్తా కామమ్మ
నారాయణంటను చెవులుమూసుకొనె కామమ్మ
ఘక్కునసీరల బద్దలైపోనూ దొరగారు
నావంటిబిడ్డలు వున్నారాలేరా సైకైనా
మారుమనుములపెండ్లి మాయింటలేదు దొరగారు
యేడుమనుములదాక మీయింటగలదు దొరగారు
నీకూతురుక్మణిని కట్టుకున్నాద మారుమనువు
దొరచస్తె దొరసాన్ని కట్టుకుంటారా మీయింట
అయితెఎవుచస్తె సిభార్య మారుమనుముగ దొరగారు
పెండ్లిచేసుకొని బాగావుంటాదా దొరసాని
యీబెస్తదొచ్చి యేలమాట్లాడె నన్నయిన
బంగారుకోటలో రనగమనలేరూ నన్నయిన
వత్యాయితిమ్మరాజు అనలేడు నన్నయిన
శుకపట్లమాదవారాయడగలేడూ నన్నయిన
యంతేనన్నుయెదురాడలేదు నన్నయిన
యీబెస్తదొచ్చి యెంతమాట్లాడే నన్నయిన
పన్నెండుపారాలు అప్పగించండి దుబాసి

సైనవచ్చి బెత్తమూడించమనెను దొరగారు
ఆమాటకామమ్మ చెవులవిన్నాది కామమ్మ
మరివక్కపారా వుండుమంటాది కామమ్మ
పారాలోవుంటే నాకేమిభయము దుబాసి
పారావాండ్లనునిన్నుదొరలు పట్టెయ్యగలను నేనైన
యెట్లాగాకాలేటి యేటిసుకలోకి ఆవేళ
కామమ్మనప్పుడు తీసుకెళ్లిరిగా కామమ్మ
ఏడురోలజుదాక తాసీరుచేసె కామమ్మను
అన్నహారములులేవు దాహాలులేవు కామమ్మ
పెదతండ్రిరానమ్మ పాలుతెచ్చిచ్చె కామమ్మకు
పాలుదాహానికి వుచ్చుకోపాయా కామమ్మ
మేడమీాదనుంచి దొరగారుజూచి దొరగారు
పాలుతాగితేను ఏదిసత్యమేమీా దుబాసికి
ఆమాటలాతల్లి కాకలింపాయె అక్కడికి
తెచ్చినపాలన్ని పినతండ్రికిచ్చె కామమ్మ
పండుటాకులకట్ట తెచ్చియిచ్చెనుగా తనమరిది
పండుటాకులకట్ట తీసుకపోయె కామమ్మ
మేడిమీాదనుంచి దొరగారుజూచి దొరగారు
ఆకుబద్ధాతింటె దీనిసత్యమేమీా దుబాసి
ఆకుతిని ఆరుసంవత్సరములు బ్రతుకొచ్చు కామమ్మ
ఆమాటలాతల్లి కాకలింపాయె అక్కడికి
తెచ్చినఆకులు పెదతండ్రికిచ్చె కామమ్మ
ఉత్తపసుపునీళ్ళతోను బ్రతుకుతున్నాది కామమ్మకు
పెత్తండ్రిగామన్న గొడుగుబట్టెనుగా కామమ్మకు
గొడుగునీడలోవుంటె దానిసత్యమేమీా దుబాసి
ఆమాటలప్పుడు ఆకలింపాయె కామమ్మకు
అప్పుడుపట్టిన గొడుగులుతీసినాది కామమ్మ
అంతకంతకు దేహ ముగ్గాలమాయె కామమ్మకు
నిమ్మబండ్లచాయా వస్తువున్నాది కామమ్మకు
తొడిగినరవికలు పిగిలిపోతుండె కామమ్మకు
మెళ్ళోనువకనాను తిరుగకున్నాది కామమ్మకు

చేతులోగాజులు చిట్లుపోతుండె కామమ్మను
అప్పుడుకామమ్మ మరిదినిపిలిపించినాడు దొరగారు
అక్కడమారయ్యను తెగలవేసినారా వోరెడ్డి
అక్కడమాఅన్నను పంపించలేదూ దొరగారు
తలుపుదగ్గరపెట్టి తాళాలువేసె మావదినె
15/662
ఇదిగాక కుంభిణిదురాయి చాలపెట్టింది గా
మంత్రిమానోట్టోరి ఆజ్ఞలుంచింది మావదినె
యింగిలీసునతాను మాటచెప్పనుగా దొరగారు
నీనిఆజ్ఞలకుమనము నిలిచివుండెదాదుబాసి
సామర్లకోటకూ జాబంపమనెనూ దొరగారు
కొత్వాలునరసయ్య పేరట్వ్రాసె జాబులుగ
తెల్లవారేవరకు జాబొచ్చెనేమీ అక్కడకు
కొత్వాలునరసయ్య జాబుచదివెనుగ నరసయ్య
తలుపుతాళాలైన పగలగొట్టిరిగా ఆవేళ
అక్కడికియిరువైనాలుగు రోజులాయెనుగా అక్కడికి
సగ్గకామగ్గకా అట్టేవున్నాడూ మారయ్య
దాదినిమ్మలోను పండించినారు మారయ్యను
మారయ్యనక్కడ పండించగానె కామమ్మ
పారాలోకామమ్మ ప్రాణముపోయె కామమ్మకు
నారాయణన్నది ప్రాణమెదిలింది కామమ్మ
పెత్తండ్రిపినతండ్రి అడలసాగిరిగ ఆవేళ
మరిదిరెడ్డన్న మరిఅడలసాగె రెడ్డన్న
అక్కడమాయన్న అయిపోయెనేమి రాజ్యములో
యిక్కడ మావదినెనూడవెళ్లెనుగ యీవేళ
సోదుఘోదునతాను ముఖపసుతాడూ రెడ్డన్న
మేడమీదనుంచి దొరగారుచూచి దొరగారు
కొంగిలిఅన్నములు తింటువున్నాది దుబాసి
అన్నములులేవయ్య ఆహారాలులేవ్పూ దొరగారు
పారాఅన్నములు మొక్కతున్నాది దొరగారు
అన్నములులేకుంటె చిక్కదురుకదా దుబాసి
నువుసీళ్ళతోటి బ్రతుకుతున్నాది కామమ్మ

ఇప్పుడు ప్రాణము పోయెనని దుఃఖపడుతాడు ఆ రెడ్డి
అన్నములు లేకనె ప్రాణాలు కడబట్లనూ దుబాసి
అప్పుడు రెడ్డిని పిలిపించినాడూ దొరగారు
అన్నములు లేకనే ప్రాణాలుకడబట్టిలోను వోరెడ్డి
ఉమరుజావబోసి బ్రతికించుకోండి కామమ్మ
ప్రాణములేకుంటె మారయ్యతోటి తగవెయ్యమనెను
పెత్తండ్రిరామన్న చేయిజాచినాడు కామమ్మ
చేతులో దాతవులు ఆడలేదయ్యా రెడ్డన్న
పెత్తండ్రిపినతండ్రి మొత్తుకున్నారూ కామమ్మని
మరిదిరెడ్డన్న వుల్లెడబట్టెగా కామమ్మ
మూటుకోసులవేలమూరము ఎత్తుకొచ్చిరి కామమ్మని
సొప్పురసోమన్న కుడికాడదింపె కామమ్మను
తెప్పునకేకేసి లేచికూర్చుండె కామమ్మ
దేవాలుయేదిరా పారాలుయేమి పినబాబు
యీవేళదాకలు యిందెల్లినావే కామమ్మ
బ్రహ్మపట్నందాక నేచూడపోతి పెదబాబు
ఆబ్రహ్మదేవుడు శలవిచ్చెనెమి పెదబాబు
మారయ్యనక్కడా పంపించినాడూ అక్కడనూ
దాదినిమ్మలోను పంపించినాడూ రామన్న
మారయ్యతోటళ్ళు మాట్లాడివస్తి రామన్న
యీవూరికధికారి యెవ్వరన్నాది కామమ్మా
పెదరెడ్డిపాపయ్య పెద్దకామమ్మా
పెదరెడ్డి పాపయ్యగారింటికెళ్ళే కామమ్మా
మానాటిలోకల్ల నిమాటగొప్పా పాపయ్య
చెలిమికోను నీచెల్లెనుగా పాపయ్య
త్రవ్వించుగున్నాలు తాళ్ళలోతుగా పాపయ్య
త్రవిస్తెగున్నాలు త్రవ్వించగలరు కామమ్మ
పైనజాతులోరి కెరుకజేసినారా కామమ్మ
యెక్కడికిపోతేను రాలేనునేనూ కామమ్మ
నాకారుయేడ్లాయెను నాకాళ్లువిరిగింది కామమ్మ
పనివుంటెబండెక్కి బజారుకెల్లా కామమ్మ

చిన్న కామమ్మ కథ.

పోయినకొళ్లు పుష్టియిస్తాను పాపయ్యా
నాకువీరిశలవేమీ దారిశలవేమీ పాపయ్యా
నేనుగన్నపట్ణంవెళ్ళి శలవుతెస్తాను పాపయ్యా
యేడోరోజుకూ తిరిగివస్తాను యింటికిని
యీయేడురోజులకు నీకోళ్లువస్తాది పాపయ్యా
సామర్లకోటలోనుంచి ఖబురంబుతాను [illegible]కైన
సామర్లకోటకు నడచివస్తావు పొమ్మనెను
తిరిగిసామర్లకోట యింటికొచ్చింది కామమ్మ
మారయ్య కాష్టంకాడకెళ్ళింది కామమ్మ
ఇంతమారయ్యకాష్టము యెలుగుతున్నవి అప్పటికి
మంటలోవకజాము కౌగిలించింది కామమ్మ
యెంతచల్లగవుంది పూలవనమూ మారయ్యా
యెంతబాగావుంది జాజివనమూ మారయ్యా
మూడుదోసిళ్ళగ్ని వడగట్టినాది కామమ్మ
సామర్లకోట నడివీధికొచ్చె కామమ్మ
కొత్తపిడతానొకటి తెప్పించినాదికామమ్మ
వాళ్ళోదిఅగ్ని పిడతలవుంటే కామమ్మ
గట్టిగాఆకోక కాలకున్నది కామమ్మకు
రాగికొమ్మవకటి తెప్పించినాది కామమ్మ
నిప్పులోఆకొమ్మ పూడ్చిపెట్టింది కామమ్మ
నాసత్యముంటేను ఈకొమ్మబ్రతుకూ పెదబాబూ
వకనాడురెన్నాళ్లు మూన్నాళ్లుజూచె కామమ్మ
నాలుగురోజుకు నానవేసినాది ఆకొమ్మ
అయిదోరోజుకు ఆకేరుపడెనూ ఆకొమ్మ
ఆరోరోజుకు బెత్తడుసాగింది ఆకొమ్మ
పెత్తండ్రినామన్న గాపాడవయ్యా యీచెట్టు
ఆరాగిచెట్టుకు అరుగువేసింది కామమ్మ
ఆరాగికొమ్మకు పూతబెట్టింది అంతటనె
మారయ్యఅస్తులూ లేరుకొచ్చింది కామమ్మ
కొత్తపిడతలోను హస్తులుంచింది కామమ్మ
ఆరాగికొమ్మకు యేలాడగట్టె కామమ్మ

పడమటిల్లు తాను అలికించినాది కామమ్మ
విసనకఱ్ఱముగ్గు తానువేసింది కామమ్మ
దర్భగడ్డిసాప నట్టింటపరచె కామమ్మ
రావోయిరెడ్డన్న నాచిన్నమరది రెడ్డన్న
లోపలతాళాలె నేనువేస్తాను యింటికిని
బైటతాళాలైన నీవెయ్యవయ్యా రెడ్డన్న
నేనుతియ్యమన్నప్పుడు తలుపుతియ్యవయ్యా రెడ్డన్న
తాళాలుచేతులు తలకిందబెట్టె కామమ్మ
దర్భగడ్డిమీద పండుకున్నాదిగా కామమ్మ
హరినారాయణన్నది జీవమొదలింది కామమ్మ
ఏడుగళ్ళకు పసిడిబొమ్మాయనేమి కామమ్మ
ఏడుగళ్ళకు చన్నపట్నమెళ్ళింది కామమ్మ
బొందెయింట్లోను జీవమక్కడా కామమ్మ
చన్నపట్నములో బాలీసుమేలీసు పిసినుగిరివా కామమ్మ
కాసులోకాసు కలలోనుచెప్పెను కామమ్మ
నైనప్ప మొదలారి కలలోనుచెప్పె కామమ్మ
దుబాసికలలోదా జెప్పినాది కామమ్మ
లాడులాదొరగారిపట్టలన్ని పసుపుచేసింది కామమ్మ
వకనాడు రెన్నాళ్ళు మూన్నాళ్ళుజూచి దొరగారు
వకనాడుదయ్యమాభూతమాఅని అనిఅడిగినాడుదొరగారు
నేనుదెయ్యానిగానయ్యా భూతానిగాను దొరగారు
మీపెద్దబోయీడు ఘనుడుమారయ్య మారయ్య
ఆరుఏండ్లకొలువు కొలిచిపోలేదా మీవద్ద
మూడునెల్లరజా పుచ్చుకొన్నాడు మీవద్ద
ఏడోఏటనో యింటికొచ్చెనుగా మారయ్య
వస్తానేమారయ్య చనిపోయినాడు యింటొద్ద
ఆమారయ్యభార్యను కామమ్మనేను దొరగారు
నేనుకలకటేరొద్ద శెలవుకెళ్ళాను గుండానికి
నన్నుఏడురోజులదాక తాసీలుచేసే ఆదొరా
గొప్పదొరవులని సెలవుకొస్తి దొరగారు
ఆరాత్రిలోను తాచెప్పినాది కామమ్మ

చిన్నకామమ్మకథ.

అంతలోదొరగారు మేలుకొన్నాడు దొరగారూ
యక్కడాజూచినా యెవరులేరైరి అక్కడను
అప్పుడుదుబాసిని పిలిపించినాడు దొరగారు
అరేయిదేమిచోద్యము వింతచోద్యము దుబాసి
బంగారుబొమ్మయియా కలలోకినచ్చె కామమ్మ
తెల్లవారిప్రొద్దున్నె మేజెక్కినారూ దొరలంత
యింగిలీషునవారు చెప్పుకున్నారు దొరలంత
మనపెద్దబోయీడు మారయ్యనంటా వాలీసు
ఆమారయ్యభార్య కామమ్మయేమి కామమ్మ
నాపక్కబట్టాలన్ని పసువుచేసింది కామమ్మ
అందరికియూలేజా అగుపడ్డదనిరి దొరలంత
యేమేమిసత్యాలు జూపగలదయ్య కామమ్మ
కోరినసత్యాలు జూపగలదయ్య కామమ్మ
జగతిలోదీనిసత్యం నేచూడవలెను దుబాసి
నాకుఆరుఏండ్లాయెను తమ్ములేల్యాడు దండ్లోకి
వారితపాలుగా మాకందలేదూ కామమ్మ
మాతమ్ముడీరాకలు మీకుచెప్పితె కామమ్మ
సికెక్కడగున్నానికి అడ్డిలేకుండా నేచేతు
పన్నెండురేవులకు జాబులంపెను కామమ్మ
ఆరాత్రికలలోను తాచెప్పినావి కామమ్మా
శ్రీరంగపట్టణాము మీదికెళ్ళెనుగా తమ్ముడు
శ్రీరంగపట్టణాము తీసుకొన్నాడు మేడీసు
ఆదివారమునా ప్రొద్దుపొడుప్పూన తమ్ముడు
మీతమ్ముడొచ్చి మిమ్ముకలపేవి దొరగారు
అంతలోదొరగారు నిద్రమేల్కొనెను దొరగారు
యిదివాక్కపరీక్షచూతమన్నాడు దొరగారు
బొక్కుమీదఆరోజు రాసేసినాడు దొరగారు
శ్రీరంగపట్ణము పరుగువెళ్ళింది కామమ్మ
మేడీసుకలలోను తాజెప్పినాది కామమ్మ
మీయన్నలాటుకు చింతనున్నది దొరగారు
చన్నపట్ణానికి పైసంబుగట్టు దొరగారు

చన్నపట్ణంమీద భ్రాంతిబుట్టించె దొరగారికి
ఆరాత్రిరెండుఝామములను రంపువేసిరిగా అక్కడను
ఆదివారమునాడు తెల్లారినట్లా మేడీను
చన్నపట్ణంలోను రంపువేసిరిగా అక్కడను
దొరలంతలేచి యెదురుగొచ్చిరిగా అప్పుడు
అన్నతమ్ములవారు కౌగలించుకొని ఆదొరలు
చెల్లుచల్లునెకామమ్మ నీకుచెల్లునమ్మ కామమ్మ
కలందానుకాగితం తెప్పించినాచె దొరగారు
పన్నెండురేవులకు జాబులువ్రాసె దొరగారు
యక్కడగున్నానికి అడ్డిలేకనేను కామమ్మ
ఆవేళమదారనవేళ నిద్రకనిపించె దొరగారికి
మద్యానవేళను కలలోనుచెప్పె కామమ్మా
నమ్మకలకటేరుదొర మహాకష్టపెట్టె దొరగారు
కలకటేరుదొరకు దరఖాస్తువ్రాయి దొరగారు
గుండాపుసామాను పంపించమనెనూ కామమ్మా
మూడుకొయ్యలవాడ ముస్తాబుచేసి దొరగారు
వాడమీదనులయితె కలాసులొద్దూ దొరగారు
రవాణచేసి విడిచిపెట్టండి ఆవాడ
నాసత్యమంటేను సామర్లకోటలో దిగును ఆవాడ
మీరుదొరలును దొరసాలును చూడరమ్మనెను
అంతలోదొరగారు నిద్రలేచెనుగా దొరగారు
ఆడకూతుర్నంత కష్టపెట్టెనా ఆకలకటేరు
ఆకలకటేరుదొరకు దరఖాస్తువ్రాసె దొరగారు
మూడుకొయ్యలవాడ బుస్తబుచేసి దొరగారు
మంచిగంధపుచెక్క వాడవేసిరిగా ఆవేళ
కుంకుమపసుపును వాడవేసిరిగా దొరలంత
నూనెసిద్దెలువారు వాడనంపిరిగా ఆవేల
కలాసిలేనిది యెట్లుపోతుంది యీవాడ
సముద్రానతోచి విడిచిపెట్టిరిగా ఆవాడ
కొడిస్తంభంమీద కూర్చున్ననేమీ కామమ్మ
తెల్లవారేవరకు సామర్లకోటలోదిగెను ఆవాడ

## చిన్న కామమ్మ కథ.

ఏడోరోజుకు బొందికొచ్చింది ప్రాణముగా
తలుపుతియ్యిరెడ్డన్న తియ్యమనెను కామమ్మ
బైటతాళాలన్ని రెడ్డితీసెనుగా ఆవేళ
లోపలతాళాలు కామమ్మదీసే ఆవేళ
నేనుచన్నపట్నపుసెలవు తెచ్చుకొన్నాను రెడ్డన్న
అంతలోచన్నపట్నం జాబువచ్చిదూకెనుగా అక్కడికి
జాబులుజూచి సంతోషపడిరి ప్రజలంత
పోయిపెద్దరెడ్డిపాపయ్యను తీసుకొనిరమ్మా రెడ్డన్న
కాళ్లులేనిపాపయ్య యెట్లువస్తుడు కామమ్మ
పోయినఆకులు పుష్టియిచ్చాను పొమ్మనెను
సొప్పనమైనాను పరుగునొచ్చెనుగా రెడ్డన్న
పెదరెడ్డిపాపయ్య వచ్చ్యాడుతుండె అక్కడను
మావదినెకామమ్మ రమ్మన్నదయ్యా పాపయ్య
వంగివంగిసలాము చేస్తువచ్చెనుగ పాపయ్య
నేనుచన్నపట్నానుంచి శెల్వుతెచ్చెను పాపయ్య
పుణ్యానగున్నాలు నాకందుకయ్యా పాపయ్య
అయిదువరహాలిచ్చి జాగకొన్నాది కామమ్మ
రెండువరహాలిచ్చి త్రవ్వించినాదీ కామమ్మ
కట్టుకున్నాకోక పుప్పర్లకిచ్చె కామమ్మ
కంకణాలజోడు పుప్పర్లకిచ్చెకామమ్మ
తవ్వేటిగుండములో గలవదెంపిరిగా ఆవేళ
కామమ్మగున్నాన పటతదంటాను ప్రజలైన
చుట్టుబట్టవారు పొర్లబడ్డానూ ప్రజలంత
తాటిసాగాసీమ ప్రజలువచ్చిరిగా ఆవేళ
యల్నాడుపొల్నాడు జూడవచ్చిరిగా ప్రజలంత
అడవిసీమప్రజలు చూడొచ్చినారూ ఆవేళ
గోదావరినుంచి ప్రజలువచ్చిరిగా ఆవేళ
అంతవెయిలక్షలపదికోట్ల ప్రజలువచ్చినారు ఆవేళ
బంగారుకోటనుంచి రంగమొచ్చెగా ఆవేళ
రాజమంత్రపుత్రాను పోలువచ్చ్యాడు ఆవేళ
చన్నపట్నపుదొరలు వచ్చిదిగినారూ అక్కడను

గంగిరెడ్ల ఆడుతున్నారే అక్కడను
ఆటదాసరివాండ్లు ఆడుతున్నారు అక్కడను
యేమశివరాత్రిలు సాగినట్లుండె అక్కడను
యేఅగ్నిహోత్రమైన యంటించినారూ గున్నానికి
నూనెసిద్దలను పల్లలపోసిరిగ యీగున్నాన
భగభగభగభగ మండుతున్నాది గుండాము
బాజభజంత్రీలు తేజంబుగనే యీవేళ
గుండంబుచుట్టును తల్యారము వచ్చుతున్నావి ఆవేళ
పాదపాటియెర్రప్ప బెండ్లిబెండ్లాము చిన్నమ్మ
లోనైనమక్కడా గున్నానబడెనూ చిన్నమ్మ
ఆచిన్నమ్మతల్లిని వారాలక్ష్మిలక్ష్మి
చిన్నమ్మసత్యాలువుండంగ బ్రతుకుతున్నాది లక్ష్మి
నాబిడ్డసత్యాలు పోతదంటాను లక్ష్మి
మాదిగవెంగడి యింటికొచ్చింది లక్ష్మి
అయిదువరహాలైన యినామిచ్చింది వెంకడికి
కామమ్మనైనాను కట్టుకట్టా వెంకన్న
యెట్టమారమ్మాను నేకొల్చినానె లక్ష్మి
యెవడిచేతిలోనేగ కట్టుపడలేదే లక్ష్మి
రేపుకామమ్మచేతులో పట్టుపడుతానే లక్ష్మి
పంచవన్నెముగ్గులు నట్టింటవేసె వెంకాడు
యెట్టమారమ్మను పంపుజేసెనుగా వెంకడు
పసుపుకుంకుమలోను పంపుజేసెనుగా వెంకాడు
యీతబుకుఅయినాను పట్టురిలాలక్ష్మి
కోసెడుమేలనే నిన్నుచూస్తగ కామమ్మ
ఘోషఘోషనతాను దుఃఖపడుతుంది కామమ్మ
యికనేనుగున్నాన పడనుఅంటుంది కామమ్మ
పూరిమీదికితాను మళ్లితిరుగునుమట కామమ్మ
బలిమినిగున్నాన బడదోస్తరేమీ గున్నాన
మూడోరోజునా నేనువెళ్లుతాను అక్కడికి
గుండముమీదనే శీలకొట్టిస్తు అక్కడను
కామమ్మసత్యాలు మణగిపోతివిగా లక్ష్మి

సిబిడ్డసత్యాలు ప్రకాసిస్త్రాదిగా భూమిలో
ఆతబుసుఅయినాను చంకబెట్టుకొని లక్ష్మి
గుండముకాడికి వస్తువున్నాది లక్ష్మి
కోసెనుమేలను లక్ష్మినిచూచె కామమ్మ
చన్నపట్ణపు దొరలవద్దకువెల్లి కామమ్మ
అన్నితబుసులునాకు యిగవుపుట్టించు దొరగారు
ఆమాటలలక్ష్మి తబుసునాకొద్దమనెను కామమ్మ
పసుపుకుంకాలకి అంటులేదని దొరలంత
మహాప్రభో మెట్టమ్మాను పంపజేసెనుగా వెంకడు
ఆపసుపుకుంకుమ వెంకడుపంపించె ధొరగారు
యీవర్తమాన అబద్ధమనిరి దొరలంత
నామాటకెందుకు కల్లజేసేరు దొరగారూ
బిళ్లబంట్రోతుల పంపించిచూడు వెంకడికి
మచ్చుమీదవాడు పండుకున్నడు వెంకడు
పన్నెండుమందిని పంపించినారూ అక్కడికి
వెంకడుయిల్లయిన ముట్టడేసిరిగా ఆవేళ
పంచవన్నముగ్గులు వేసివున్నావి నట్టింట
మచ్చుమీదవాడు పండుకునివుండె వెంకడు
పండంగ లేవంగ నెట్టుకొనివచ్చిరిగా వెంకన్ని
వెంకన్నిచూచి యేమంటుంది కామమ్మ
నాయొక్క వేడుకలు సహించలేక వెంకన్న
మెట్టమారెమ్మాను పంపుచేస్యావా కుంకుమలో
అయిదువరహాలయిన యినామిచ్చింది లక్ష్మి
కలకాలమూ కు గ్రాపమవుతాదా వెంకన్న
నేనుచేసినపంపైన నిజమన్నాడు వెంకడు
పన్నెండుమంది పయినబడ్డారు వెకండిపైన
స్యాపబెత్తాలతో కొట్టబోతేచూ కామమ్మ
లోనుకొట్టవద్దువాన్ని తిట్టవద్దుఅనెను కామమ్మ
నాలుగుఘడియలు యిక్కడావుండు వెంకన్న
నాయొక్కసంభ్రమములు జూచిపొమ్మనెను కామమ్మ
పండుటాకులకట్ట చేతికిచ్చింది కామమ్మ

వాడుతాంబూలం వేస్తానుఖుషాగుండె వెంకడు
పదహారుపండ్లూడి క్రిందపడ్డదిగా వెంకడికి
యికనుబుద్ధిగలిగినీవు బ్రతుకుమన్నాది వెంకన్న
మంచాలవెంకమ్మ చూడొచ్చెనేమి వెంకమ్మ
పన్నెండువరహాల తానొకటిబాయా వెంకమ్మది
యీపాటపేరంటానికి కేమొస్తినమ్మా నేడైన
యీముండపేరంటాలు పడకుంటెనేమి గున్నాన
మాయత్తనూమామ వర్ధనగవస్తి నేనైన
మాయింటిమొగవారు వర్ధనగవస్తి నేనైన
ఆమాచేటిప్రజలోను యేమంటుంది కామమ్మ
తిట్టకెవెంకమ్మ నీవుతిట్టకమ్మ వెంకమ్మ
నావంటిచెల్లెలు అక్కలులేదా నీకయినా
బిళ్ళబంట్రోతుల పంపించినారా రమ్మాని
నీకుకాటుసిపాయుల పంపించినారా రమ్మాని
నీవువొళ్ళుతెలియక పారేసుకొని వెంకమ్మ
వున్యానకీవేళ నన్నుపట్టవే వెంకమ్మ
ఆటదాసిరివాండ్లు ఆడుతున్నారు అక్కడను
ఆదాడదాసినైన జూస్తవున్నాడు రాజయిన
రాజమంత్రపు కావురస్తుడైన అతడు ఆరాజు
ఆముత్యాలురాజన్న చెయిబట్టుకొనెను కామమ్మ
చెలిమితో నీకునే చెల్లెనుగానా రాజన్న
నీజిమ్మిచెట్టుక్రింద నానుదొరికింది అన్నయ్య
వెలవెలబోయినాడు రాజన్నతాను రాజన్న
నీవువెలవెలపోబోకు వెఱ్ఱిరాజన్న
నీకుచ్చిళ్ళచెరుగునా మూటవున్నాది రాజన్న
నవ్వుతాఆనాన నాకుయీవయ్యా రాజన్న
కిలకిలాదానవ్వి మూటిప్పినాడు రాజన్న
కామమ్మచేతులో నానువుంచెనుగా రాజన్న
యిందవేవెంకమ్మ నీనానుదొరికె వెంకమ్మ
ఆనాను అప్పుడు కుదువబెట్టింది వెంకమ్మ
మంచిగంధపుచక్క తీసుకొచ్చింది వెంకమ్మ

రెండుసేర్లపసుపు తీసుకొచ్చింది గుండానికి
ఆవకసేరుకుంకుమ తీసుకొచ్చింది గుండానికి
ఆపసుపుకుంకుమ కనులజూచించి కామమ్మ
నీపసుపుకుంకానికి వచ్చియన్నానా వెంకమ్మ
తొలిచూరుకుమారుడు నీకుగలిగెనే వెంకమ్మ
మారయ్యపేరుపెట్టి మన్నించిపిలవవే వెంకమ్మ
మలుచూరికుమార్తె నీకుగలిగెనే వెంకమ్మ
కామమ్మపేరుబెట్టి మంచిపిలవవే వెంకమ్మ
ముద్దుకూతురును ముద్దుకొడుకూను వెంకమ్మ
నీగర్భమందున పుడుతారుపొమ్మా వెంకమ్మ
ఆపాటిభాగ్యము నాకుగలిగితె కామమ్మ
నీకుబంగారువుయ్యాల తొట్లుకావింతు కామమ్మ
నీకువెండితోవుయ్యాల నేనుచేయిస్తు కామమ్మ
నీకురత్నాలవుయ్యాల నేనుచేయిస్తు కామమ్మ
నీకుముత్యాలవుయ్యాల నేనుచేయిస్తు కామమ్మ
పద్దెనిమిదేండ్లాయె పెద్దమనిషియయ్యె వెంకమ్మ
సాష్టాంగమప్పుడు దండంబెట్టె కామమ్మకు
మనివుండగానాకు దండంపెట్టద్దు వెంకమ్మ
నేనుచచ్చినతర్వాత దండంబెట్టండి వెంకమ్మ
నాకుగుండానికిప్పుడు శెలవియ్యవయ్య దొరగారు
కట్టుమోతలుయీడ చాలావున్నారు దొరగారికి
కట్టుమోతలువుంటె నీకుభయమేల కామమ్మ
కట్టుమోతలనీవు పట్టియ్యగలవా కామమ్మ
దొంగముచ్చటలనీవు గట్టియ్యగలవా కామమ్మ
యిప్పుడుగుండాన నీవుపడితేను కామమ్మ
ఆనికెనినత్య మెట్టుదెలినేని మాకయిన
జూచేటిప్రజలంత తిరిగిపోతారూ దొరగారు
ఇకమూడురోజులుమీరు ఉండండి ఇక్కడను
నేనుగుండానపడ్డా మూడోనాడేమి దొరగారు
గుండమంతాను చల్లారిపించు దొరగారు
మారయ్యరుమాల యట్టెవుంటుంది గుండములో

నాదిమూరెడుమైజారు చెరుగువుంటుంగి గుండమున
మంగళసూత్రాన బొందువుంటుంది గుండాన
వకచేతిగాజులు యట్టెవుంటవిగా గుండములో
వక్కాలిమెట్టలో యట్టెవుండవిగా గుండములో
యఱ్ఱకలువపువ్వు పట్టుకొస్తుంది గుండములో
పువ్వుతీసిమీరు గుంటసుంచండి దొరగారు
పెదరెడ్డిపాపయ్యను పిలిపించిమీరూ దొరగారూ
గున్నాలుయప్పుడు పూడిపించండి దొరగారూ
యీగుండముమీదనే పందిలెయ్యించి దొరగారూ
పందిట్లోయీపువ్వు పూజజేయించు దొరగారూ
యనిచెప్పికామమ్మ స్నానానికెళ్ళె కామమ్మ
స్నానముచేసిరిగా తిరిగివచ్చించి కామమ్మ
యింటింటవిందులు బోంచేసినాది కామమ్మ
యింటింటగొబ్బెర కాయలందింది కామమ్మ
భాజభజంత్రీలు తేటంబుగానె కామమ్మ
పెద్దబజారునా వస్తువున్నాది కామమ్మ
పెత్తండ్రిరామన్న యెదురుగుండొచ్చె రామన్న
ఘోరఘోరమున తాను దుఃఖపడుతాడు రామన్న
యెందుకేడుస్తావు యెఱ్ఱిపెదబాబు రామన్న
వింటివామనవి వివరంబుగానూ రామన్న
నాకరువెలో తలితండ్రిలయిపోయినారు పెదబాబు
యతిగలాబానను పెంచినారూ రామన్న
చిన్ననాడయప్పుడు గంగిరెడ్డోళ్ళు రామన్న
పెద్దబజారున ఆడుతుండంగ రామన్న
ఆగంగిరెడ్లవానిండ్లనే జూడబోతి రామన్న
పెత్తల్లి వెంకమ్మ యేమన్నాది నన్నయిన
గుండానపడియేటి పేరంటాలు అనెను పెత్తల్లి
అప్పుడబద్ధమే ఇప్పుడునిబద్ది పెదబాబు
తనయొక్క కోరికలు చెల్లెనని చెప్పా బాబయ్య
తనయొక్క ముచ్చటలు తీరెనని చెప్పా బాబయ్య
తనయొక్క ఇష్టము యీడేరెనని చెప్పా రామన్న

## చిన్న కామమ్మ కథ.

తనయొక్క యత్నము సరిపోయెనని చెప్పి పెదబాబు
పుణ్యపుస్నానము తానుఆడెనమ్మ కామమ్మా
జవిరిగుండ్ల పేరువకటి డెలిపింది కామమ్మా
పుత్తాండాలపేరు వకటిదెలిపించి కామమ్మా
పసుపుకుంకమలోను దూసికలిపింది కామమ్మా
మనివుండిబంగారు పంచిపెట్టింది కామమ్మా
పుణ్యపాసిరాడి వస్తువున్నాదిగా కామమ్మా
బాజబాజంత్రీలు తేజంబుగాను కామమ్మా
నేనుగున్నానపడ్డ పేరేమియనెనూ కామమ్మా
నావస్తువాహానాలు యవరిదన్నాది వుండేమి
మాదాసువెంకయ్యను పిలిపించినాడే కామమ్మా
తానుపుట్టిండిపెరిగింది వ్రాయమన్నాది కామమ్మా
కననమేరుపరచి ప్రకాసిచెయ్యి వెంకయ్య
పాతికెవరహాలు వెంకయ్యయిచ్చె కామమ్మా
మారయ్యనగలన్ని వెంకయ్యకిచ్చె కామమ్మా
దేశాలుమీద నే ప్రకాస్తిచెయ్యి వెంకయ్య
అప్పుడుమారయ్య అస్తులువిప్పుకొచ్చింది కామమ్మా
మారయ్యఅస్తులే గున్నానవేసె కామమ్మా
పెదరెడ్డిపాపయ్యనే పిలిపించినాది కామమ్మా
విన్నావాపాపయ్య వివరంబుగానూ పాపయ్య
నాకుపిల్లానువొద్దయ బోనాలువొద్దు పాపయ్య
నాకుతొమ్మిదంతరాల రథముకట్టించి పాపయ్య
వుత్సవవిగ్రాల చేయించుమీరు పాపయ్య
అంతవేదివాలె తిరునాలచెయ్యి పాపయ్య
కాలేటిసూర్యుడా దండమన్నాది కామమ్మా
నేనుతొక్కినాభూదేవి తోడుగావమ్మా భూదేవి
వేడుకతో వెంకటేశ్వరుని దలంచిందికామమ్మా
ప్రీతితో భీమగానికిమ్రొక్కె కామమ్మా
చూచేటిప్రజలెల్ల గండమన్నాది కామమ్మా
చూచేటిజనులకెల్ల దండమన్నాది కామమ్మా
దొరలంతగట్టున నిల్వపడ్డారే దొరలంత

అందరికివక్కటే సలాముచేసె కామమ్మా
గుప్పించిఆతల్లి గున్నానదూకే కామమ్మా
మంటలోవకఝాము మాటలాడింది కామమ్మా
మెదుగుత్రడికలవారు తప్పించినారూ గున్నాన
నాలుగోపారి యేమనిపలికే కామమ్మా
కార్తికపున్నాన తిరునాళ్ళనాకు పాపయ్యా
చూడవచ్చినప్రజలు తిరిగివెళ్ళిరిగా ఆవేళ
మూడురోజులదాక దొరలువున్నారు అక్కడను
మూడోనాడైన చల్లారిపించి గున్నానని
మారయ్యారుమాల అట్టేవున్నాదిగా గున్నమిలో
మూరెడుమైజారు అట్టెవున్నాది గున్నములో
మంగళసూత్రాన బొందివున్నాది కామమ్మ
వకచేతిగాజులు వక్కాలమెట్టెలు అట్టెవున్నది గున్నాన
యట్టకలుపపువ్వు పుట్టుకొచ్చింది కామమ్మ
ఆపువ్వుతీసితాను గట్టునవుంచె పాపయ్య
గున్నముఅప్పుడు పూడిపించెనుగా పాపయ్యా
ఆగున్నముమీదనే పందిలివేసిరిగా అప్పుడే
పందిటఆపువ్వు పూడించినారూ అక్కడను
చెన్నపట్ణపుధొరలు తిరిగివెళ్ళిరిగా ఆవేళ
బంగారుకోటకు రంగమొచ్చెనుగా ఆవేళ
కార్తికెపున్నము వెన్నెళ్ళవుండె ఇకనేమి
కరకటేరుధొరకు కండ్లుపోగొట్టె కామమ్మ
కోటలోవస్తారు కండ్లుపోగొట్టె కామమ్మ
ధరఖాస్తుయయూ వెళ్లుతారేమి కలకటేరు
సామర్లకోటలో మకాముజేసే యూవేళ
కామమ్మకప్పుడు సలాముచేసే దొరగారూ
పోయిననాకండ్లు రెండువస్తేను కామమ్మ
పోగానెనాపని మళ్ళివస్తేనూ కామమ్మ
నికుచేవతాళ్లుగొట్టి గుళ్లుకట్టిస్తు కామమ్మా
యీయేడు తిరునాళ్లు నేనుచేయిస్తు కామమ్మా
నెల్లూరికాడికి వెళ్ళేవరకు ధొరగారూ

# చిన్న కామమ్మ కథ.

దొరకు అక్కడ కండ్లు ఇచ్చింది కామమ్మా
పోయిన చెన్నపట్నపు లాడ్లు కలపోను చెప్పె కామమ్మా
కాకినాడనుంచి వస్తువున్నాడూ కలకటేరు
మునుపటియాపని మళ్లి యిప్పించు ధొరగారు
చెన్నపట్నముతాను వెళ్లేవరకూ కలకటేరు
మూడోనాటికి హాజరు అయినాడూ కలకటేరు
మళ్లి కాకినాడకైనా పైనంబు గట్టె ధొరగారూ
30 రోజులకు సామర్లకోటలో డేరాలు వేసే ధొరగారూ
చెల్లునే కామమ్మ నీకు చెల్లునమ్మా కామమ్మా
నీమహిమలు నాకు తెలియకపాయా కామమ్మ
కంసాలబత్తుల పిలిపించినారే ఆవేళ
ముప్పై తాళ్ళకు సెలవిచ్చినాడూ ధొరగారూ
మాసము రోజులకు గుడిగట్టినారే పత్తులుగా
పుత్తళవిగ్రహాలు చేయించినారూ ఆవేళ
మంచివారమునాడు ప్రతిష్ట చేసి పాపయ్య
తొమ్మిదిరోజులు జాగారమేమీ కామమ్మకు
అన్నప్రధానము చేయించినారూ బ్రాహ్మణులకు
తొమ్మిదంతరాల రథముగట్టించె పాపయ్య
దేశదేశజనులు చూడొచ్చినారూ అక్కడికి
చతుర్ధశినాడు తబాలు యేమీ కామమ్మకు
నిండుపౌర్ణమినాడు రథముతీసిరిగ కామమ్మకు
మూడోనాడుగ నోమునోచ్చారు కామమ్మకు
జూడవచ్చిన ప్రజలు తిరిగివెళ్లిరిగ ఆవేళ
కామమ్మగుడిచుట్టు తోటవేయించి దొరగారూ
వారికడపాతోటి తరుచుగవేసి అక్కడనూ
మల్లెలు మొల్లెలు పరిజాతివనమూ అక్కడనూ
మంచిచామంతెల వనమువేసిరిగ అక్కడనూ
తెల్లగన్నేరుల వనమువేసిరిగ ఆవేళ
మంచాల వెంకమ్మ గర్భిణితో వుండె అప్పుడు
తొమ్మిదిమాసములు మోసిందియేమీ వెంకమ్మా
పొలిచూరి వెంకమ్మ కొడుకును గనెను వెంకమ్మా

మారయ్యపేరుపెట్టి మన్నించిపిలిచి వెంకమ్మా
మలిచూరుకూతురు గలిగిందియేమీ వెంకమ్మా
కామమ్మపేరుపెట్టి మన్నించిపిలిచె వెంకమ్మా
వారుబంగారువుయ్యాల తొట్లుచేయించి కామమ్మకు
వారురత్నాలవుయ్యాల నాడుచేయించి కామమ్మకు
వారుముత్యాలవుయ్యాల నాడుచేయించి కామమ్మకు
వారురత్నాలవుయ్యాల నదురుజేయించి కామమ్మకు
గుళ్ళోనుఆతొట్లు యూలాడకట్టె వెంకమ్మా
వకనిమ్మపండయ్యి వూగుతుంటుంది కామమ్మా
వకయరటిపండయ్యి వూగుతుంటుంది కామమ్మా
వకద్రాక్షపండయ్యి వూగుతుంటుంది కామమ్మా
వకమామిడిపండయ్యి వూగుతుంటుంది కామమ్మా
యిప్పటికియిప్పటికి వూగుతున్నాది కామమ్మా
కామమ్మచరిత్ర విన్నవారికి భాగ్యములు
తయ్యగవుండును దీర్ఘాయుస్సు కలుగునెప్పటికి

చిన్నకామమ్మకథ




పూర్ణము.

యన్. వి. గోపాల్ అండు కో.,
నెం 37 తిరుప్పళ్లివీధి, సౌకారుపేట పోస్టు, మదరాసు.

# ఔషధముయొక్క ముఖ్యగమనింపు.

మామందులు చాల ప్రశస్తముగా తయారుచేయబడినది. అందు ల్ల మంచిగుణము నిచ్చునని నొక్కి చెప్పగలము. మార్కెట్టులో అ ేకములగు మందులున్నవి. వాటివలె నీమందులను చూడ నవసరము దు. మామందులు ఒకమారుపయోగించువారికి మందులయొక్క శస్తత తెలియగలదు. అటులు ఉపయోగించువారికి గుణమియ్యకున్న ందు. వాపసుచేయువారికి మందుఖరీదు తిరిగి పంపివేయబడును.

మనింపుడు! స్త్రీలయొక్క వరప్రసాది!! పరీక్షించి చూడుడు!

అనేకులు వుపయోగించి యోగ్యతాపత్రము వడసిన

# పుత్రసంతాన సంజీవినూనె,




స్త్రీలయొక్క గర్భమున పురుగులు జేరి ఇంద్రియమును నాశపఱచుట చేతను పదేపదే గోరోచ్చు చేయుటవలనను గర్భ గోళమునందు కండపెరిగి రక్తగడ్డ యున్నను, వాయువు శైత్యము చేరినను స్త్రీలకుగర్భము నిలువదు. అట్టి వారు యీనూనెను ఉదయం సాయంకాల ములయందు 1-టి లేక 3-దమ్మిడీలు తూనిక చొప్పున 15 రోజులు సేవిం చినచో గర్భగోళముననుండు అరువిధ ములగు రోగములను నివర్తించి ఆ మరు నెలలోనే గర్భమునిలుచును కొందరికి 2-3-నెలలవరకు నిలిచిపిమ్మట పోవు టగలరు అట్టివారికికూడా యీ ఔష ధముపరమ శ్రేష్టమైనది.




ఆర్యబృంద సహోదరులారా! ఈపుత్రసంతాన నూనెనుకొని ఒకపర్యాయము యింటిలో స్త్రీలకు యిచ్చిచూడుడు. ఈపుత్రసంతాననూనె పరమశ్రేష్టమైనది స్త్రీ లిటి వరప్రసాది, పుత్రులు లేనివారికి పుత్రసంతానము కలుగజేసి ఆనందింపజేయు మహా నూనె ఇదియొకటియే యనవచ్చును. సీసా 1-కి 2-0-0

ఇది సేవించువిధము ఔషధముతో పత్రికపంపబడును.

త్వరపడుడు! సకలమైన మేహావ్యాధులు తీరును!! త్వరపడుడు!!!

# మేహానివారణి అమృతసంజీవి నూనె.




మిత్రులారా! ఈమేహానివారణిసంజీవినూనె సుమారు 50 సం॥ ముందు హిమాలయపర్వతములయందు ఒక మహారుషివల్ల కనిపెట్ట బడినది ఈఅవుషధము దైవానుగ్రహమువల్ల మాపెద్దలకు వుపదేశింప బడినది. ఈసంజీవినూనె మాచెన్నరాజధానిలో అనేకరోగులకు ఈ నూనె ఆశ్చర్యకరముగా రోగము ఖండించబడినదియీనూనె ఒకసారి మావద్దతీసి సేవించినవారు తమ స్నేహితులకు తెలిపించినందువల్ల వారిమూలముగా మాకు కొన్ని ఆర్డర్లువచ్చుచున్నది. అనేకమైన ఔ షధములవల్ల రోగములు నివారణలేక రోగములచే బాధపడుచు మన స్సురోసి యెట్లును తోచక గొప్ప అవస్థలో చింతించేరోగులకు యీనూనె స్వల్పధరలో తయారుచేయడమైనది.

ఈనూనె కొన్నిశాస్త్రసంబంధమయిన నూటయిరువది పచ్చి మూలికన్ను ఉప్పువగయిరా ఆకుపసరుతో తయారుచేసి అనేకరోగ ములను ఖండించబడిన ముఖ్యమైన అవుషధము యెటువంటి దుర్గుణమైన వ్యాధులున్నూ ఇంకా పలువిధమేహారోగములను భస్మముగా నశింపజేయు సంజీవి అమృతనూనె యనిచెప్పగలదు.

ఈనూనెవల్ల నివారణవ్యాధులవివరం:—కంఠమాల, అర్ధకర్రలు, కోరుకు, ఆసనసం బంధమయిన మూలవ్యాధులు, పెట్లసవాయి, చిట్లపిరంగి, నల్లమచ్చలు, సవాయి, గ్రంథి, మేహతామర మచ్చలు, మేహదురదలు, గజ్జి, మేహములు, పార్శ్వవాయువు, మేహవా యువు, మూతకజన్ని, కాళ్లుచేతులు పట్టుపట్టుట, ముఖమువుబ్బుట, తెల్లసెగ, పచ్చసెగ, మూత్రములోవచ్చుచెడువ్యాధులు, నడుమునొప్పులు, కుసుమవ్యాధి, అధికమేహమువల్లవచ్చు పచ్చకామిర్లు, మూతకోరుకు యేనుగు కాళ్ళువలెవుబ్బుట మొదలయిన మేహారోగములను ఖండించి రక్తశుద్ధిచేసి జనులు ఆశ్చర్యపడునట్లుగా దేహము సూర్యునివలె తేజస్సును మన్మ ధునివలె పుత్రసంతానమున్ను కలుగజేయును, అవుషధమునకు పత్యనోటీసు బుడ్డితో పంప డును. తమయొక్క వ్యాధి యెన్నిదినములుగా యున్నదిన్ని రోగముయొక్క వివరం తెలి యపరచవలెను. మీయుత్తరములు రహస్యముగావుంచబడును.

దినములుగడచిన వ్యాధులకు 5 పూటలునూనె 3-0-0

సాధారణమయిన వ్యాధులకు 3 పూటలు నూనె 2-0-0

## వెంట్రుకలు పెరుగు సువాసనచుక్కలు.



యిదిమంచినూనెయందుగాని లేక కొబ్బరినూనె యందు గాని కలిపి ప్రతిదినము కురులకు పూసుకొన్న వచ్చిన ఆకురులు మర్రిపూడలవలె పెరుగును యివి పూ సుతూవచ్చినను పేనులు, చుండు యివి అన్నియు చె కురుపులురాక వేరుకు బలముకలిగించును.

0-1-



## కన్నడిన్ మ్యాజిక్ లేక రహస్యసిరా.

ఇది అమెరికా దేశమున ప్రఖ్యాతిపొందిన ప్రవీణులవల్ల క్రొత్తగా కనిపెట్టబడినది. ఇతరులు కనుగొనకుండులాగున అంతరంగ రహస్యజాబులు వ్రాయువారికి ఈరహస్యమయిన సిరా మిగుల వుపయోగకరమయినది, అందరికిని ముఖ్యమయినది. ఈసిరాతో వ్రాసిన యేవిషయముచేతను వ్రాసినవిషయములు యెవరును కనుగొన జాలరు. బుడ్డి 1-కి 0-8-0

## గోల్డి కత్తినరుకు గాయములకు తైలము.

ఈతైలమును గాయము తగిలినచోట రుద్దినవెంటనే రెండుమూడు దినములకు లోగా గాయముమానిపోవును. చీముమొదలైనవిపట్టదు. యెప్పటికిని అందరిగృహమునందుండతగినది. బుడ్డి 1-కి 0-8-0 డజను 5-0-0

# కస్తూరి మాత్రలు.

ఈ మాత్రలు జలదోషము జలుబు నీట్లకుతాంబూలముతో చేర్చి పుచ్చుకొనవచ్చును బ్రాలింత్రీలు తాంబూలముతో భుజించినయెడల సుఖముగ ప్రసవించుదురు. 0-8-0



## సకలవిధ పాడసంహారి.

శరీరము మెడతలలుగలకంఠము చంక, తొడలుసంధు సర్వాంగములు ధరించు నడుముభాగము అనగా నడుముచుట్టును, పొత్తికడుపునందును, చిన్నబొబ్బలై పేలి దినదినమునకు వృద్ధియై తీరనితీటగల్గి నిద్రను భంగము చేయునట్టితామర, మేహతామర, మేహకారకతామర, దట్టపుతామర, దక్షిణదేశమునగల పురుగుకాటు మొదలగు వాట్లను రెండుదినములలో వున్నచోటుతెలియకమాన్పి సుఖపరచును.

సీసా 1-కి 0-8-0

తామరమందు బుడ్డి 1-కి 0-8-0 డిటో డజను 1-కి 5-0-0

## నరసిన వెంట్రుకలను.



5-నిమిషములలో నలుపు చేయు తైలము.

దీనికంటె యెక్కువయగు తైలము భూమండలమున లేదు మాయొక్క తైలము నెరసిన వెంట్రుకలకుపూసిన 5 నిమిషములలోగా నల్లనివెంట్రుకలనలనే జేయును మిగుల బలిమినిచ్చును దీనినిచరిమినతర్వాత ముఖలక్షణమున్ను, తేజమున్ను, కలుగుటవలన వయోధిక్యముగలవారున్ను తెలియబడకనబడుదురు ఇదినిజము దీనినిఉపయోగించువిధము మందుతోకూడ పంపెదము. సీసా 1-కి 1-0-0

## అమృతసంజీవిలేహ్యాం అయఃకాంతసింధూరం.



ఈలేహ్యంవలన కడుపునొప్పి, పక్కశూల, గుల్మవ్యాధి, పాండురోగం, పిత్తరోగం, కామాల, రొమ్ముశూల, ఎక్కిళ్ళు, పైత్యవాయువులు, నోటియందునీపారుట, వాంతి, కండ్లుమంటలు, మలబద్ధక, కడుపులోమంట, కడుపుబ్బుట, దేహమంటలు, కళ్లు, పైత్యాధిక్యముచే స్వప్నములుకలుగుట, నిద్రరాకుండుట మొదలగుసకలరోగములు 48 దినములుసేవించుటచే తీరి దేహమునకు రక్తముగలిగి ధాతుపుష్టినికలిగించి నిరోగులనుగాచేసి ఆయుర్వృద్ధిని కలిగించునని చెప్పగలము మోతాదుప్రాత 1-కి అగటులము పాలు, నెయ్యి కావలసినంత చేర్చుకొనవచ్చును పత్యంలేదు స్త్రీసంభోగము కూడదు.

24 రోజులకు 1-సేరు అమృతసంజీవిలేహ్యాం, అయఃకాంతసింధూరం 2-0-0
48 రోజులకు 2-సేర్లు మొత్తంగాతీయువారికి తపాలకర్చులతో 4-0-0

## మూలరోగ సంజీవి లేహ్యము.

లోపలిమూలము, బయటమూలము, చీముతోచేరినమూలము, బెట్టమూలము, రక్తమూలము మొదలగు పాతరోగములను సకలవిధ మేహవృష్ణములనున్ను పారదోలును మూలరోగులకు ఆస్పత్రిలో తీరకున్నను ఈయౌషధమువల్ల నివారియగును. డబ్బి 2-0-0

## సకల మేహరాజ సంజీవి మైనము.



ఈ మహామైనము బహుకాలము దేహములోపూరిన మేహవాయువు మేహరోగమువలనకలిగిన పగుళ్ళు, మేహరణములు, పల్లముడిన పుండ్లు, గ్రంధి, మర్మస్థానమందుగలుగుకొరుకుపుండ్లు చిరకాలము అనేక ఔషధములను సేవించియు తీరని తెలుపు, పసిమి తెలుపు రక్తతెలుపు, మూత్రద్వారముమంట, అప్పుడప్పుడు లింగముకొనయందు సూదితోగ్రుచ్చినట్లు సహింపరానిమంట, తొడఅరటి, అనగా తొడయందు అరటికాయవలెగలుగు నొకవిధమైన పొడలు ఇత్యాది మేహసంబంధమగు క్రూరవ్యాధులనన్నిటిని 40 రోజులలో ఏఅనుమానములేక ఖండించుటచే దీనికి సకల మేహరాజాంగ సంజీవిమైనమను నామంబు అర్థమయినది.

సకలమేహవ్యాధులను అంతమొందించుటకు ఈమైనము చిన్నడబ్బిలో అయుండినను పైవ్యాధులుంగలవారు నమ్మకముతో సేవించినయెడల దేహములోపల శక్తిని వ్యాపింపజేసి మిక్కిలి శ్రద్ధతో పైవ్యాధులను నివర్తిజేయుటకై ఈపరమాప్తకంకణముధరించియున్నదని దృఢముగచెప్పగలము. ఔషధమహిమలువర్ణింప ఈపత్రికొటివ్వదు. గాన నొకమండలం ఔషధము తెప్పించుటకు నేడే త్వరపడుడు. దీ జించి దేహపుష్టి కలుగచేసుకొనుడు. పెరయోల అనుభవించినపిమ్మటగదా దీనిమ 1 లియవచ్చును.

ఒక మండలం 20 దినములకు 3-

# గోపాల్స్‌టానిక్కు.

ఆకలిని కలుగజేసి బలమును ఇచ్చునట్టి ఔషధరాజము.



1 గోపాల్స్‌టానిక్కు అను ఔషధము హయముతోను, పలువిధములగు వనమూలికలచేతను తయారుచేయబడి జనులకు మిక్కిలి వుపయోగకారియగు పరమశ్రేష్టమైన ఔషధరాజము.

2. గోపాల్స్‌టానిక్కు అను ఔషధము బలహీనము, దేహశ్రమ, తలత్రిప్పుట, నపుంసకత్వముతొలగించి దేహమునకు బలమును కలిగించును. మగతనము లేనివారికిగూడ ఈ అవుషధమును పుచ్చుకొనిన లింగమునకు బలమునుకలిగించి ఇంద్రియ పటుత్వమును, దేహదారుఢ్యమును కలుగజేయు గొప్ప అవుషధరాజము.

3 గోపాల్సుటానిక్కు అను అవుషధము జీర్ణశక్తిలేనివారికి ఈ అవుషధము పుచ్చుకొనినతోడనే ఆకలిని కలిగించి యెటువంటి పదార్థమునైనను త్వరలో జీర్ణముకలిగించి రక్తమును వృద్ధిపరచి దేహపటుత్వమును కలిగించు గొప్పదగు అవుషధరాజము.

4 గోపాల్సుటానిక్కు ఈఅవుషధముతో సమానమగు టానిక్కు మరేదియును లేదు. శరీరములకు బలమును కలుగజేసి వృద్ధులనుసహా పరోవంతులుగ జేయును.

5 ఈఅవుషధము పుచ్చుకొను విధము:—భోజనమునకు ముందు ఈ అవుషధమును కొంత చల్లనినీళ్ళతో అర్ధటీస్పూను మొదలు ఒక టీస్పూనువరకు కలిపిపుచ్చుకొనవలయును. దినమునకు 3 పర్యాయములు పుచ్చుకొనవలయును మందుపుచ్చుకొనిన వెంటనే యేదయిన ఆహారమును భుజింపవలయును. దీనికి యేలాటి పథ్యములేదు.

సీసా 1-కి రూ 1-8-0

ముఖ్యగమనింపు:—ఈ అవుషధరాజమును విడునక మూడుసీసాలు సేవించిన యేలాటి వ్యాధులను దగ్గరచేరనీయక తొలగించివేయును.

# శెగరోగనివారణి.



మూత్రము విడలనపుడు పోట్లు, మంటలు, మూత్రద్వారమునుండి తెల్లగాగాని, పచ్చగాగాని చీమువంటి ద్రవముపెడలుట, పొత్తికడుపు నరములు బిగడీయుట మూత్రకోశమున బొట్లుతెరుచుగా విసర్జనముచేయుట, మూత్రము బొట్లుబొట్లుగావెడలుట మొదలగుగుణములతో నీరోగము ప్రారంభించిన వెంటనే ఈద్రావకము యేడుపూటలుసేవించిన నాళముదగ్గర వుండుమాని చీమువంటిద్రవముకట్టి మూత్రముధారాళముగావెడలును. నాళములయందలి జిలమానును ఈ ద్రావకము పాతి శెగరోగములనుగూడ నతిత్వరలో మాన్పును. దీని వెల 1-4-0

రోగము త్వరలోపూర్తిగకుదురుటకు మూత్రమార్గమును శుభ్రముగానుంచవలయును అందులకుగాను ఆమార్గమున పిచ్చికారుపెట్టికడుగుట యుక్తము, కోరువారలకు పిచ్చికారును అందులకు ఉపయోగించుమందును డైరక్షనుతో 1 రూపాయకు పంపబడును.

# హనుమంతసంజీవి లేహ్యమున్ను,

వెండిభస్మముతో.



ఈ దివ్యౌషధము **40** దినములు సేవించినయెడల యవ్వనమునందు కేవలము స్త్రీలోలురై యుండుటచేతను దేహపటుత్వముతప్పి సత్తువలేనివారై జీర్ణశక్తిలేక బలముడిగి జ్ఞాపకశక్తిలేక సంభోగవాంఛ బొత్తిగాలేనివారల దుఃఖమునుపోగొట్టి శుక్లమునువృద్ధిపరచి యౌవ్వనవంతులుగా జేయుటయందు ప్రసిద్ధికెక్కినది, ఈ దివ్యౌషధము నపుంసకత్వము, త్వరితస్ఖలనము, లింగముయొక్క అశక్తతను పోగొట్టి నరములకు బలమిచ్చును,దేహమునకు తేజస్సు కలిగించును. ఈలేహ్యభస్మములు, వృష్ణవాయువు, పార్శ్వవాయువు, పిత్తమయికం, నోరూరుట, పసరుబడుట, తలత్రిప్పుట, రొమ్మునొప్పి, కాళ్ళుచేతులుపోట్లు, మేహకొక, అశక్తి మొదలైనవి నివర్తించి ధాతువును గట్టిపరచి సౌఖ్యమును కలుగజేయును.

**20** రోజులకువచ్చు లేహ్యము వెండిభస్మము **2-0-**

**40** రోజులకువచ్చు లేహ్యము వెండిభస్మము పోస్టేజితో.సహా **4-0**

## దృఢధాతుకరణి.



ఇది అనేక కారణములచేత శుక్లదోషమేర్పడి దేహపటుత్వముచెడి జీర్ణశక్తియు సంభోగవాంఛయులేక కష్టముతో కాలము గడువువారిని రక్షించుసంజీవకరణి. ఈలేహ్యము స్త్రీసంగమమును మణివలెపుట్టిపలుచి రతియందు శీఘ్రవీర్యస్ఖలనము పోగొట్టును. సకల మేహములు మూలరోగములు, అగ్నిమాంద్య, రోగములు, సోమరితనము, నడుమును కాళ్లనునొప్పులు మొదలగు బలహీనతచేగలుగు సకల దుర్గుణములను నిశ్శేషముగా ఖండించును. స్త్రీలకుగలుగు తెలుపు, యెరుపుమొదలగు సకలవ్యాధులు పోగొట్టును: శరీరబలమునుహెచ్చించును. బాలంతనమున వరసిన వెంట్రుకలను నలు యును. ఇంద్రియనష్టములేక పలుచయగుటవలన బలహీనతచే గృశించినవారీ దివ్యౌషధము **20** దినములుసేవించిన నత్యాశ్చర్యముగు శుక్లవృద్ధిబొంది నవయౌవనవంతులై సుఖము లనుభవింప శక్తులగుదురు. బాలురు, గర్భిణీస్త్రీలు,వృద్ధులు వ్యాధిలేనివారు సేవించి సంపూర్ణ ధాతువృద్ధిని బొందవచ్చును. ఇవి భుజించుటకు మిగుల రుచికరమైయుండును. ఈదృఢధాతు సంజీవికరణిని సేవించిన మూడవదినమే సంతోషచిత్తులగుద

**20** తులములు డబ్బి **2-**